

# అమృతరాముని ఆదర్శసూత్రాలు

(సూక్తులు)



ఓం శ్రీ గురవే నమః

శ్రీ గురుచరణమ్ భవహరణమ్
శ్రీ జగద్గురు పరబ్రహ్మణే నమః

శ్రీశ్రీశ్రీ సద్గురు రామబ్రహ్మానందస్వామి గారిచే

# అమృతరాముని ఆదర్శసూత్రాలు

(సూక్తులు)

## శ్రీ గీతా జ్ఞాన గురుభక్తమండలి

(శాస్త్ర విధానోక్త ముక్తి మార్గము)

విరచితము

ఇంటి నెం. 17-1-382/కె/యస్.బి./48,
బాలాజీ నగర్, (సైదాబాద్) చంపాపేట్ దగ్గర,
సైదాబాద్, హైదరాబాద్ - 500 059.
ఫోన్ నెం. 9848744776

సంస్థాపకులు :
**శ్రీశ్రీశ్రీ జగద్గురు రాములు గారు (నంబి)**

వ్యవస్థాపకులు :
**శ్రీశ్రీశ్రీ సద్గురు రామబ్రహ్మానందస్వామి గారు**

సర్వాధికారములు :
అధ్యక్షులు
**శ్రీ గీతాజ్ఞాన గురుభక్తమండలి**

ప్రథమ ముద్రణ
01-02-2011

ప్రతులు : 1000

**శ్రీ గీతాజ్ఞాన గురుభక్త మండలి**
ఇంటి నెం. 17-1-382/కె/యస్.బి./48,
బాలాజీ నగర్, (సైదాబాద్) చంపాపేట్ దగ్గర,
సైదాబాద్, హైదరాబాద్ - 500 059.
ఫోన్ నెం. 9848744776

ముద్రణ :
**శ్రీలక్ష్మి గ్రాఫిక్స్**
48-131/203, యస్.వి. రెసిడెన్సీ, రామ్‌రెడ్డి నగర్,
ఐ.డి.పి.యల్. కాలనీ, హైదరాబాద్ - 500 037.
ఫోన్ 98487 40588

వెల రూ. 25-00

## ఓం శ్రీ గురవే నమః

## పరిచయము

1. పేరు : **శ్రీ బంధయ్య (గారు)**
2. జననం : 12-8-1965
3. జన్మస్థలం : చిల్‌మల్ మైల్వార్ గ్రామము, బొంరాస్‌పేట మండలము, మహబూబ్‌నగర్ జిల్లా, ఆంధ్రప్రదేశ్.
4. జననీజనకులు : **శ్రీమతి అనంతమ్మ, శ్రీ రామయ్య**
5. గురూపదేశం : 02-04-2001 సంవత్సరములో పొందబడినది.
6. బ్రహ్మీభూతస్థితి : 2003 సంవత్సరములో పొందబడినది.
7. సద్గురుస్థితి : 2008 సంవత్సరములో భగవత్ అనుగ్రహమువలన ప్రకటించటమైనది.
8. ఆధ్యాత్మిక నామధేయము : **శ్రీశ్రీశ్రీ సద్గురు రామబ్రహ్మానందస్వామి**
9. ప్రస్తుత కృషి : **శ్రీ భగవద్గీత ప్రవచన ప్రచారము**
   అర్హులైనవారికి ముక్తి మార్గోపదేశము
   భగవత్ కృపవలన ఆధ్యాత్మిక గ్రంథ రచనలు.
10. ప్రస్తుత నివాసము : ఇం. నెం. 17-1-382/కె/యస్.బి./48, బాలాజీ నగర్, (సైదాబాద్) చంపాపేట్ దగ్గర, సైదాబాద్, హైదరాబాద్ - 500 059. ఫోన్ నెం. 9848744776



శ్రీ జగద్గురు పరబ్రహ్మణే నమః



## శ్రీశ్రీశ్రీ జగద్గురు రాములు గారు (నంబి)

(దైవసందేశహారి)

శ్లో॥ నగురోరధికం తత్త్వం నగురోరధికం తపః
నగురోరధికం జ్ఞానం తస్మై శ్రీ గురవే నమః




**శ్రీశ్రీశ్రీ సద్గురు రామబ్రహ్మానంద స్వామి వారు**

(దైవసందేశహారి)

శ్లో॥ గురురేకోహి జానాతి స్వరూపం దైవమవ్యయమ్
తత్‌జ్ఞానం యత్‌ప్రసాదేన నాన్యధా శాస్త్ర కోటిభిః

# సందేశము

పరిశుద్ధాత్మ స్వరూపులారా!

లేవండి ఇకనైన మేలుకొండి. ఈ జన్మరహస్యమును ఛేదించండి. ఒక వ్యక్తి ఒక స్థలము నుండి ఇంకోక స్థలమునకు వెళ్ళవలసివచ్చినపుడు ఏదో ఒక కార్యముతో బయలుదేరు చున్నాడు. మరి అలాంటప్పుడు మీరు ఏదో ఒక లోకమునుండి ఈవసుధకు వచ్చారు. ఎక్కడి నుండి వచ్చారు? మరి వచ్చిన ఆ కార్యమేమిటి? ఒకసారి విచారించండి. మరి వచ్చిన కార్యాన్ని ఎంతమంది సాధించుకొని బయలుదేరుచున్నారు? లేకపోతే ఎందుకు? కావున ఇక్కడ దుర్బలమైన జీవితాన్ని అస్వాదించడానికి రాలేదు, ప్రతి ఒక్కరు తనను తాను తెలుసుకొని తన గమ్యస్థానాన్ని చేరుకోవడానికి మాత్రమే ఏతెంచారు. కాని ఆ వచ్చిన పనిని మరిచారు. అందువలన ఆ పరమాత్ముడు మళ్ళీ మన కార్యాన్ని మనకు తెలియ పరచడమునకు, ఈ లోకంలో తన సందేశాలను వినిపించడానికి కొంతమంది మహాత్ములను పంపినారు. వారు తనను తాను తెలుసుకొని ఆ విషయాలను ఇతరులకు తెలియజేయ నిమిత్తము, అహోరాత్రులు కృషిసలిపి రాజగ్రందముల ద్వారా మరియు సత్సంగములద్వారా, విన్నవించుచున్నారు. అందులో ఒక భాగంగా నా గురుదేవుని అనుగ్రహంద్వారా, నేను అనుభవపూర్వకముగా కొంత మరియు, కొంత గ్రంథములద్వారా, సంకలనముచేసి ఈ చిన్నపాటి ఆదర్శసూత్రాలను వ్రాసి ఉడుతాభక్తిగా సేవ చేసుకుంటున్నాను.

కావున ఈ అమృతరాముని ఆదర్శ సూత్రాలు చదవి వాటిలో నున్న సారాన్ని గ్రహించి, గమ్యస్థానమునకు మార్గము వెతికి పయనించగోరుచున్నాను. మరియు ఆ పరమాత్మా నందము పొంద గోరుచున్నాను.

చిన్న పుస్తకము ముద్రణకు సహాయపడిన దాతలు, ఆ పరమాత్మ అనుగ్రహాన్ని పొంది వారికి సకల ఆయురారోగ్య ఐశ్వర్యములు మరియు భవబంధ విముక్తికి పాత్రులగుదురని ఆ పరమాత్ముని వేడుకొనుచున్నాను.

ఇందులో అనుభవపూర్వకముగా వ్రాయడానికి నాకు వాక్కిచ్చిన నా గురుదేవులకు శతకోటి ప్రణామాలు అర్పించుకొంటూ ఈ పుస్తకాన్ని నా గురుదేవులైనటువంటి శ్రీశ్రీశ్రీ జగద్గురు రాములు గారి చరణారవిందములకు సమర్పించుకొనుచున్నాను.

ఇట్లు

**శ్రీశ్రీశ్రీ సద్గురు రామబ్రహ్మానంద స్వామి**

**శ్రీ గీతజ్ఞాన గురుభక్తమండలి**

సైదాబాద్, హైదరాబాద్.





## శ్రీ గురవే నమః

## శ్రీ గురుచరణం భవహరణం

## అమృతరాముని ఆదర్శ సూత్రాలు

**(సూక్తులు)**

శ్లో॥ విజ్ఞాన హేతుం విమలాయ తాక్షం
ప్రజ్ఞాన రూపం స్వసుఖైక హేతుం
శ్రీరామచంద్రం హరిమాది దేవం
పరాత్పరం రామం అహం భజామి॥

తా॥ విజ్ఞానానికి కారణుడు, విశాలములైన కళ్ళు కలవాడు. ప్రజ్ఞాన రూపుడు, ఆత్మసుఖానికి హేతువు. పరాత్పరుడు, ఆది దేవుడు హరి అయినట్టి శ్రీరామచంద్రున్ని నేను భజిస్తున్నాను.

శ్లో॥ బర్జనం భవ బీజనాం
అర్జనం సర్వసంపదాం
తర్జనం యమదూతనాం
రామ రామేతి గర్జనం॥

తా॥ రామ నామము సంసార దుఃఖము యొక్క బీజమును దహింపజేయును. సమస్త సంపదలను చేకూర్చును. యమదూతలను దూరంగా తరిమివేయును. స్మరించువారికి పరమానందము కలుగజేయును.

**"నీ హృదయము సముద్రమువలె గంభీరముగా ఆకాశమువలె నిర్మలముగా ఉంచుకొనుము."**



## గురుస్తుతి

వందనంబిదిగో వందనము నీకు
హృదయవాస నీకు ముదితముగను
నిరతము నీపాద సేవలో నుంచుమా
నిఖిల జగన్నివాస నిర్గుణరామా

సచ్చిదానంద రూపాయ విశ్వోత్పత్యాది హేతవే
తాపత్రయ వినాశాయ జగత్‌గురువాయ వైయంనమః



## అమృతరాముని ఆదర్శసూత్రాలు (సూక్తులు)

★ సర్వాకర్షనీయ వస్తుజాలమంతా నీలోని ఆత్మయొక్క ప్రతిరూపమే, ప్రపంచ వస్తుజాలమంతా నీనీడ మాత్రమే. అలాంటప్పుడు నీ నీడను నీవెంటాడడము ఎంతమూర్ఖత్వము.

★ అజ్ఞానము చేత దేహాత్మభ్రాంతి కలుగుచున్నది. అజ్ఞానాన్ని పరిత్యజిస్తే పాపాలన్నీ పారిపోతాయి.

★ మానవ స్వస్వరూపమైన ఆత్మ అద్వితీయమైనది. తనకంటె రెండవవాడు లేని ఒకానొక అద్వితీయస్థానము అధిరోహించడమే మానవుని కర్తవ్యం.

★ ఏడుపు ముఖాలతో - ఈడుపు కాళ్ళతో పరిస్థితులు చక్కబడవు, సమస్త దుఃఖ నివృత్తికి ఏకైకమార్గము సత్యాత్మ జ్ఞానమే.

★ కుమ్మరి పురుగు బురదలో నున్నప్పటికి బురద అంటదు. ఓ మానవుడా? నీలో అతిపవిత్రమైన దోషరహితమైన ఆత్మ ఒకటి ఉందని తెలుసుకో.

★ నువ్వు ఆత్మజ్ఞానం పొందితే త్రిలోకపూజనీయమైన పరమాత్మను, నీస్వస్వరూపముగా గ్రహించగలిగినప్పుడు నీవు మహాత్ముడవు, పూజనీయుడవు, నీవేసాక్షాత్ భగవంతుడవు.

★ ఎందుకు దుఃఖ పడతావు? నీలోని సత్యాత్మ అన్నింటి కంటె మహెూత్తమమైనది, నీలో దేవాది దేవుడు ఉన్నాడు. లోనికి తొంగిచూడు.

★ ఎంత కూడబెట్టినా ఆశకు అంతులేదు. ఎంత ఎక్కువ సంపద కూడునో ఆశ జ్వాల అంత ఎక్కువగా చెల రేగుతుంది సుమా!

★ ప్రతి మనిషి రెండురోగాలతో బాధపడుతున్నాడు. ఒకటి కండ్ల రోగము రెండు కడుపురోగము.

★ సమస్త భూతకోట్లు తన స్వరూపాలే అన్న ఆత్మ తేజాన్ని సంపూర్ణంగా తెలుసుకో.

★ లోభంకు నీవు ఒక్క నిమిషం గురి అయినావా, నీ బాహ్య శరీరాన్ని దాచుకున్నావా, నీలోని దివ్యకాంతి నాశనమవుతుంది.

★ కార్యసిద్ధి కావలెనన్న ప్రతి వ్యక్తి నదీజాలాలవలె నిరంతరం చైతన్యాన్ని పోలివుండాలి.

★ తెల్లని వస్త్రము ఏ రంగును స్వీకరించదు. దానిలాగ ప్రతి వ్యక్తి సాత్వికముగా నుండవలెను.

★ నల్లని వస్త్రములు అన్ని రంగుల్ని మింగుచున్నవి. ఒక రంగును కూడ ఇవ్వడములేదు. వానిలో త్యాగ గుణములేదు. అజ్ఞాని కూడ దేనిని వదలడము లేదు.

★ మనమెంత జ్ఞానం దానము చేస్తే మనకంత జ్ఞానం దానము చేసిన కొద్దీ చేకూరుతుంది.

★ నీవు కృషి చేసేటప్పుడు దేహాభిమానము మరచిపోయి నీ కార్యములో నిమగ్నుడైపోవాలి. నీకు జయము తప్పదు.

★ సత్యం ఒకరి సొత్తుకాదు. అందరి సొత్తు, ఆ తేజాన్ని అందరు ఆస్వాదించవచ్చు.

★ మీ క్రియాశక్తుల్ని అత్యుత్తమ స్థితిలో ఉంచే దివ్యశక్తి ఒకటున్నదని మీకు తెలియడములేదా, అట్టి దివ్యశక్తిని మీరు ఉపయోగించుకుంటే మీరు ఎప్పుడు ఉత్కృష్టులుగానే ఉంటారు.



★ ఓ జీవుడా! శరీరము జంగమ ధర్మాన్ని, ఆత్మ స్థావర ధర్మాన్ని అవలంబించవలెనని తెలుసుకొని పాటించు.

★ స్వార్థ ప్రయోజనాలను కల్పించుకొని నీ దివ్యైశ్వర్యాన్ని మలినం చేయవద్దు. ఆ వాంఛలు నీ అభివృద్ధిని అరికట్టి నీ శాంతిని పోగొడుతాయి.

★ గోడకు ఉపయోగించే రాయి వీధుల్లో పడి ఉండడము లేదు, నీకు అర్హత ఉన్నప్పుడు సమస్తమూ నీపాదముల కడకే వస్తుంది. కావున అర్హత సంపాదించు.

★ ఓ మానవుడా ! నీ అహంకారాన్ని నీ వ్యక్తిత్వాన్ని కర్మపీఠంపై బలి ఇచ్చినప్పుడే జయం నిన్ను అనుసరిస్తుంది.

★ నేనేమౌతాను నాపని ఏమౌతుంది అని స్వార్థపరత్వముతో నిండిన చిన్న బురదగుంటలే ఏడుస్తుంటాయి.

★ నీవు అభివృద్ధి పొందాలంటే స్వార్థత్యాగం చేయాలి నిత్యత్యాగివి కావాలి, నాదనే స్వార్థబుద్ధిని విడనాడాలి.

★ అహంభావాన్ని, గర్వాన్ని వదలిపెట్టు, నీ వస్తువును నీదని ఎప్పుడూ అనుకోవద్దు. అంతా భగవంతునిదే.

★ నీవెంతకాలము కోరుకుంటావో, వాంఛిస్తావో, కోరికలను పట్టుకోని ఉంటావో, అంతకాలం ఆ కోరికలు ఫలించవు.

★ ప్రేమంటే ఏకత్వం అనుభవించటమే, అంతటా అందరిలో నిజ ఆత్మను చూడడమే.

★ ఈ ప్రపంచమంతా ఒక్కటే శరీరము. దానికి నీ శరీరము ఒక చేయిలాంటిది.

★ ప్రేమ సమస్థానికి మూలము. ప్రేమే జయానికి ముఖ్య సూత్రము. నీ ద్వేషిని కూడ నీవు ప్రేమించు.

★ నీ ధర్మాన్ని నీవు నిర్వర్తిస్తే, నీ కార్యములో నీవు భక్తుత్సాహాలు చూపిస్తే, బాహ్య సహాయాన్ని గురించి నీవు చింతించనవసరము లేదు. సహాయం తనంతటదే నీకోసం వెతుక్కుంటూ వస్తుంది.

★ నీ ఇచ్ఛనే నీవు సేవిస్తున్నావు. నీ ప్రస్తుత పరిస్థితులన్ని నీ సృష్టే అని గ్రహించు.

★ భావమే విధికి నామాంతరము, కనుక నీ విధిని నీవే నిర్ణయించుకో.

★ నీ పనిని విధిలేక చేసే కూలివానిలా గాక బంతి ఆడే రాజకుమారునిలాగ ఆనందంగా నిర్వహించవలెను.

★ నీడ కొరకు పరుగెత్తేవాడు ఎన్నటికి దానిని పట్టుకోలేడు. అది వాడికంటె ముందే పరుగిడుచున్నది.

★ వేదాంతమే నిర్భయత్వము, నిర్భయత్వమే వేదాంతము, నిన్నెవ్వరు స్పృశించలేరు, నీకెవ్వరూ కీడు చేయలేరు.

★ సంశయము చేత, భయంచేత నీ దుఃఖాన్ని నీవే తెచ్చుకుంటున్నావు. శరీరలంపటత్వమే భయానికి మూలకారణం.

★ నీ మనస్సులో లేనిదేది నీకు సంప్రాప్తించదు, ప్రేమిస్తే ప్రేమ కనపడును. నీవు ద్వేషిస్తే ద్వేషమే కనపడును.



★ తగిన బందోబస్తు లేనప్పుడే దొంగలు ఇంట్లో ప్రవేశిస్తారు ఇంట్లో దీపమున్నంత సేపు వారు జొరబడరు.

★ నేను పాపిని, నేను మూర్ఖుణ్ణి, నేను నీచుణ్ణి, నేను దీనుణ్ణి అని దీనాలాపనలు చేయవద్దని వేదాంతము చెప్పుచున్నది.

★ నీవు అఖండశక్తివి, అనంతుడవు, ఆనందస్వరూపడవు, సర్వఆత్మవు అని గుర్తుంచుకో.

★ ఈ ప్రపంచమంతా నీ సృష్టే, నీ భావమే.

★ బాహ్య విషయాలన్ని నిన్ను చిట్టచివరకు నాశనం చేస్తాయి సుమా!

★ నీ ఇచ్ఛలకై భగవంతున్ని కోరకూడదు. ఈ విషయములో భగవధేచ్ఛ నీఇచ్ఛకావాలి.

★ పదిమందిలో చిన్నతనంగా ఉన్నదని ఒక పనిని విడవడము ఆత్మగౌరవముకాదు. మన నిజాత్మను అంతరంగములో నున్న భగవంతున్ని గౌరవించడమే.

★ నీ జయమెప్పుడూ నీతోటే ఉంటుంది. ఈ ప్రపంచాన్ని ఒక పవిత్ర దేవాలయంగా చూడు.

★ మానవ లోకంలో చేసే నిందాపనిందలను నీవెప్పుడు విశ్వసించవద్దు. అవి దుష్టదానికి దారితీస్తాయి.

★ నీ చుట్టూ సృష్టించుకున్న కామపాశాలను త్రెంచుకోవటమే నీ విప్పుడు చేయవలసిన కార్యము.

★ నీ బందాలను, నీ పాశాలను అలంకారాల విధాన నీవు ప్రేమించనవసరంలేదు.సర్వవాంఛనలను వినాశనం చేయి. అప్పుడు ప్రపంచమెంత మహాశక్తి అయినా నీ పాదరక్షలు మోయెటమే మహాభాగ్యమని నీకు అంజలి చేస్తుంది.

- ★ శరీరము మీద అధికారాన్ని వదిలినప్పుడు ఆ మానవుడు భగవత్ప్రేరితుడౌతున్నాడు.
- ★ ఓ మానవుడా ! నీవు నిర్భయస్థితికి అధిగమించు, భగవంతుడు స్వయంగా తన అమృతహస్తాలతో నీ శరీర వేణువును అందుకుంటాడు.
- ★ మీ స్వస్వరూప పరమాత్మ యొక్క అడుగుజాడలను మీరు తప్పనట్లైతే, మీరు నిరంతర దైవ ప్రేరేపితులై, ఆనంద స్వరూపలై జీవించగలరు.
- ★ నేను చేస్తున్నాను, నేను భోగిస్తున్నాను అనే అహంకృతికి నీవు అతీతుడవై యున్నప్పుడు భగవంతుడు నీద్వారా పని చేయిస్తున్నాడు.
- ★ ఓ జీవా! అడుగు నీవు పొందగలవు. తలుపు తట్టు పరమాత్మ ద్వారము తెరువబడుతుంది.
- ★ తన జీవితాన్ని ఎవడు వాంఛిస్తాడో వాడు తన జీవితాన్ని పోగొట్టుకుంటాడు.
- ★ తుచ్ఛయాచనలతో కూడిన ప్రార్థనలు భగవంతుని చెవిలో పడవు.
- ★ ఎప్పుడూ యాచనాతత్త్వములో, తృష్ణలో మునిగి సంతాప పడుతుంటాడో, నిరంతర వాంఛ పీడితుడై ఉంటాడో, వానిని ఆనందము సమీపించదు.
- ★ సమస్త దుఃఖాలు, సమస్త బాధలు, సమస్త సుఖాలు సమస్త భోగభాగ్యాలు, దరిద్రములు ఏవి నిన్ను తాకలేవు.
- ★ ఓ మానవుడా ! భౌతిక పదార్థాలను ఎప్పుడూ గట్టిగా పట్టుకోవాలని ప్రయత్నించకు. తత్ఫలితంగా వేదననే చిక్కుతుంది.



- ★ అడవిలో నక్కలు, గొర్రెలు సమావేశమౌతాయి. గుంపులుగా ఆధారపడతావి కాని శత్రువుని ఎదిరించలేవు కాని సింహము ఒక్కటే ఉంటుంది. ఆ గర్జనకు అన్ని పరుగెడతాయి కావున రామనామ గర్జన చేయి, శత్రువులు పరుగెడతారు.
- ★ వేదాంతమును వ్యాప్తి చేయడానికి, వేదాంత ప్రచార ప్రబోధాలు చేయడానికి, స్వయంగా నీవు సత్య సాక్షాత్కారము పొందవలెను.
- ★ నీలో నీవు జీవించు, నీ ఆత్మలో నీవు జీవించు, నీవు పరంజ్యోతివని భావించు, జగన్నాథుడవని తెలుసుకో.
- ★ బాహ్య సంస్కారాల చేత జనులతో అతిగా కలిసి తిరగడముచేత, ఆధ్యాత్మిక శిఖరాలను అతిదూరమై పోవడము చేత, నీవు శక్తిని కోల్పోతావు సుమా!
- ★ అహంబ్రహ్మాస్మి! నేను సర్వస్వరూపుడైన పరమాత్మను అని తెలుసుకోగలిగినట్లైతే, దేహేంద్రియాలకు నీవు బద్ధుడవు కావు.
- ★ నీ శరీరమున్న చోట నీవు నివసించడము లేదని తెలుసుకో, నీ మనస్సు ఎక్కడ నివసిస్తున్నదో, నీవక్కడనే నివసిస్తున్నావు.
- ★ ప్రపంచము నీకేమి ఇవ్వగలదు, సమస్త సుఖమూ సమస్త ఆనందమూ నీలో నుంచే వస్తున్నది చూడు!
- ★ భవరోగ నివారణకు నీవు సంపూర్ణానంద స్వరూపడవని గ్రహించి, సర్వపదార్థములలో బ్రహ్మస్వరూపం తప్ప నీవు వేరు చూడకూడదు.

★ భగవంతుని కంటె దేనికి ఎక్కువ విలువఇవ్వవద్దు. భగవంతునితో సమానంగా దేనికి తావివ్వవద్దు. విమర్శలు, రోగాలు వాటిని ఆత్మవలె గౌరవించావా అవి నిన్ను నాశనం చేస్తాయి.

★ అహంకృతి లోపలదాచుకొని, పరమాత్మ రాజ్యాధికారాన్ని ఆశించిన వాడిని, గర్వపర్వత శిఖరముపైన దురాశావసలనే గ్రద్దలు పొడిచి చీల్చి చెండాడుతాయి.

★ అవస్థ పెట్టకుండా మానవుణ్ణి సాధనలో ముందుకు పోనివ్వదు.

★ బ్రహ్మ సత్యం జగన్మిథ్య అన్న వేదాంత ధర్మాన్ని ఉల్లంఘించడమే సమస్త దుఃఖములకు మూలము

★ శిశువు ఏవిధంగా నిరాడంబరముగా నైజంగా నడవడము నేర్చుకోవలసివుందో, అదే మాదిరిగా మానవుడు సంపూర్ణంగా మరణించడము నేర్చుకోవలసివుంది.

★ దుఃఖానికి గల కారణము నీకు అంతర్దృష్టిలేదు, నీ అభిప్రాయాలను నిరూపించుకోలేవు, అంధవిశ్వాసము మీద ఆధారపడడమే.

★ దట్టమైన చీకటి గదిలోకి నీవు వెళితే గోడకు తగలడమో, తల తగిలి గాయము కావడము తప్పదు సుమా!

★ నీ కర్మలకు వెనుక ప్రకాశించే పరమశక్తిని కనుక్కో, ఆ పరమశక్తిని తెలుసుకో, ఆ శక్తి నీవే అని గ్రహించు.

★ ప్రపంచ విషయ వస్తు, వ్యక్తి వ్యామోహము చేత మీకు ఆనందము లభ్యముకాదు ఇది ధర్మం.



★ శిశువును నా బాలుడు అనే భావమును వదిలి భగవంతుడనే దృష్టితోచూడడమే సర్వసంగ పరిత్యాగము.

★ తన భార్యకు గురువుకాలేని భర్త, తన భర్తకు జ్ఞానప్రదానము చేయలేని భార్య, తమ జీవితంలో ఆనందాన్ని పొందలేరు. తన భర్తకు ఆధ్యాత్మిక స్వేచ్ఛను జ్ఞానమును ఇవ్వజాలని భార్య మహాపాపి. అదే ప్రకారము తన భార్యకు - తన గృహమును ఒక గురుకులాశ్రమంగా చేయలేని భర్త మహాపాపి.

★ నీ చేతులు మట్టి అయినప్పుడు, నీవు వాటిని కడిగి పరిశుభ్రము చేసుకుంటావు. అలాగే జన సంపర్కంచేత అహంకారవికారాన్ని నీగృహానికి రాగానే క్షాళనం చేసుకో.

★ ఆవగింజంత విశ్వాసం నీలో ఉన్నట్లయితే పర్వతమును రమ్మని ఆజ్ఞాపించు, అది నీ చెంతకు నడిచివస్తుంది.

★ నిజమని నీవు నమ్మిన సమస్త బాహ్య విషయాలు కేవలం మాయని తెలుసుకో!

★ ఒక వాక్యమును ఆచరణ పెడితే చాలు

★ సమస్త జగత్తు నీ భావము మాత్రమే, ఈ మహావాక్యాన్ని విశ్వసించు.

★ నీ తల్లిదండ్రులు వారి శక్తికొలది వారు మంచి చేశారు. నీ శక్తికొలది నీవు మంచి చేయి. నీ మోక్షము నీకు సంబంధించింది. నీ తల్లిదండ్రులది కాదది.

★ పరిపూర్ణ శక్తిని నేనని దివ్యానిభూతిని పొందు, పరిమితబద్ధమైన అహంకృతి చేతనే సమస్త దుఃఖాలు కలుగుతున్నవి.

★ పుట్టనే లేదు, పుట్టయుండలేదని, నీవు పరబ్రహ్మవని, ఈ దేహానివి కావని ప్రగాఢ విశ్వాసముతో ఉండు.

★ విధిబద్ధుడను అనే భావముతో కర్మచేయకు, రాకుమారునివలె వినోదంలాగా నీ పనిచేయి ఈ ప్రపంచము నీకు వినోదక్రీడగా మారిపోతుంది.

★ ఒక కుక్క మాంసము ముక్కను నోట కరుచుకుంటే, ఇతర కుక్కలు పోట్లాటకు వస్తాయి. ఎప్పుడైతే నీలోని స్త్రీ పిశాచ రోగాన్ని నివృత్తి చేసుకుంటావో అప్పుడు ఈ భవరోగము దానంతట అదే నివృత్తి అవుతుంది.

★ విషయ త్యాగముచే భగవద్దర్శనము లభించును.

★ రాగరహితునకు గృహమే తపోవనము.

★ నీవెవరో ముందు తెలుసుకొనుము.

★ ఆత్మ స్వాతంత్ర్యమే జీవిత లక్ష్యము.

★ పరమాత్మ ప్రాప్తియే మానవ జన్మ ఉద్దేశము.

★ అన్నిటియందు భగవంతుడున్నాడని తలంచి, ప్రాణులన్నిట యెడల దయగల్గి ఉండుట నిజమైన భక్తియనబడును.

★ మోహము భయంకరమగు అగ్నిజ్వాలవంటిది.

★ అన్యమతములను కొంచెమైనను ద్వేషించకుము.

★ భగవంతుని సాక్షాత్కరించుకొనుటకు నీకు తోడు నిలిచె ఏ మతమైనను సమ్మతమే.

★ మానవుడు సర్వదా జ్ఞాన సంపాదనకే పాటు పడలవలయును.



★ సుఖము, దుఃఖము అనెడివి కిరీటమును దాల్చి మానవుని వద్దకు వచ్చును. సుఖమునకు స్వాగతము చెప్పువాడు దుఃఖమునకు కూడా స్వాగతము చెప్పవలసినదే.

★ పుస్తకమును చదువుటతోపాటు మస్తకమును కూడ చదువవలెను.

★ విద్యను ఆర్జించుటతోపాటు, అవిద్యను కూడ దూరము చేయవలయును.

★ దేహబలములకై వ్యాయామము చేయునట్లు, ఆత్మబలమునకై యత్నింపుము.

★ ధనమును సమకూర్చుటకు శ్రద్ధవహించినట్లు ఆత్మను పొందుటకు శ్రద్ధతో ప్రయత్నింపవలెను.

★ ఆత్మకు మరణములేదు, జననములేదు. దేహము నశించును కాని ఆత్మకు నాశనములేదు.

★ ఇప్పుడు ఈ జన్మలో పరిపూర్ణులము కాజాలయేని, మరొక జన్మలో కాగలమనుటకు ఋజువులేదు.

★ ఎప్పుడైనను దైహిక పరత తొలగిననేని, పారమార్థిక పరత కలుగదు.

★ తన హృదయ గ్రంథము తెరుచుకొనిన వారికి ఇతర గ్రంథములు అక్కరలేదు.

★ ఫల వాంఛలు లేని సత్కర్మలు పరమపద సోపానములు. కష్టములు మానవునికి నీతి ధర్మములను భోదించును.

★ చిత్తఏకాగ్రత లేనిది దేనిని సాధించలేము.

★ సాధనముల ఉద్దేశము సాధకునికి చిత్తశుద్ధిని కలిగించుటయే.

★ చిత్తైకాగ్రత యోగవిద్యాభ్యాసానికి జీవకట్టలాంటిది.

★ వాదము అలజడిని ఉత్పత్తిచేయును. వృథాతర్కము అజ్ఞానమునకు చిహ్నము.

★ కామ ఉపాసకుడైనవానికి కాలపాశము వెంటనేయుండును.

★ అడుగడుగున ఆత్మజ్ఞానము నలవరుచుకొనుము.

★ అజ్ఞానమావరించినపుడు, తక్షణమే నీ నిజస్వరూపమును భావించుము.

★ యదార్థమనగా కేవలమున్నదున్నట్లు చెప్పుటయేకాదు సత్యమగు ఆత్మను సాక్షాత్కరించుకొనుట కూడను.

★ భవ బాధలను బాపుటకు జ్ఞానమే దివ్యౌషదము.

★ జ్ఞానము నిరంతర సాధన వల్లగాని చేకూరదు.

★ ద్వేషము భక్తి మార్గాన్ని అధోగతికి మరిలించును.

★ ద్వేషరహితుడైన మానవుడే దైవసాన్నిధ్యమును పొందగల్గును.

★ మతవైషమ్యము మానవజాతి మనుగడకే మహా అవరోధము కావున సర్వమతసారమును సద్గురువుల నాశ్రయించి సాధించుటకు ప్రయత్నించుగాక.

★ నీ బాధకు కారణమేమైనప్పటికి నీవు మాత్రము ఇతరులకు బాధను కలుగజేయకుము.

★ సమస్త ప్రాణికోట్ల యెడల దయ కరుణ కలిగి యుండుటయే నిజమైన ధర్మము. ఇదియే నిజమైన మతము.



★ విషము విషము కాదు, (దృశ్య) విషయములే విషములు అని చెప్పబడినది. ఏలయనిన విషము ఒక్క దేహమునే నశింపజేయును. విషయములో అజ్ఞాన వాసనాదులు ద్వారా అనేక జన్మలందును మృత్యువును కలుగజేయును.

★ ఈశ్వరానుభవమువలననే జనులకు అద్వైతానుభవము కలుగును. అది లేనిచో కలుగదు.

★ పరిపూర్ణమును బొందగోరువారు "నేనెవరను" అను విచారణ చేసి తన్ను తానెఱుగుట అత్యావశక్యము.

★ తన ధర్మము ననువర్తించు ప్రతి వ్యక్తియు మహనీయుడే ఎవడు జీవారాధకుడో అతడే శివారాధకుడు.

★ సముద్రమునే లక్షింపుము, అలను లక్షింపకుము.

★ చీమకును, దేవతకును భేదము నెంచకుము.

★ శివుని సేవింపగోరువాడు ముందు అతని బిడ్డలను సేవింపవలెను. స్వార్థరాహిత్యమే మతధర్మములకు గీటురాయి.

★ బరువంతయు మోసుకొని ప్రక్కనే ప్రభువు నిలబడియుండగా, వెఱ్ఱిజీవుడా! ఇక ఏల దుఖించెదవు. ఆ జగత్కర్త సర్వసమర్థుడు సుమా!

★ విషము భుజించిన పిదప జీవుని చంపును కాని విషయములు దర్శన మాత్రము చేతనే జీవుని బాధించును.

★ నాయనా! తరతరాలు సుఖించవలెనని పెద్దపెద్ద భవనములు కట్టుకొన్నావు. అయినా నీవనుభవించేది తుదకు మూడున్నర మూర స్థలము మాత్రమే యని గుర్తించుకొనుము.

★ ప్రాణులారా! మేలుకొండు ఈ ప్రపంచమొక దీర్ఘ స్వప్నము రామనామము నిపుడే ప్రారంభించి ధన్యులుకండు.

★ ఈ శరీరమొక పచ్చికుండ దీనిని నమ్మివిఱ్ఱవీగకుసుమా! దైవ మంత్రముచే దీనిని పరితప్త మొనర్చి జన్మరాహిత్యమును బొందుము.

★ లలాటలిఖితము తుడిచివేసినచో పోవునది కాదు ఎందులకు అవస్థపడుదువు. గురువును శరణుజొచ్చి హరిని భజింపుము, కుమర్గామును వదిలి దయా ధర్మములను పాలింపుము.

★ మరణమును స్మరణమునందుంచుకొని హరిభక్తి తత్పరుడవుకమ్ము.

★ అంతఃకరణములో శ్రీమన్నారాయణుడు నివసించి యున్నవారికి ఆనందలక్ష్మికేమి కొదవ.

★ నేను అను తలంపు లేచుటయే జన్మము. అదిపోయి తాను ఆత్మగా నిలుచుటయే జన్మరాహిత్యము.

★ బహిర్ముఖుడై యున్నంతకాలము ఆత్మజ్ఞానము ఎవరికి లభ్యముకాదు. అంతర్ముఖుడైనపుడే ఆత్మ, సాధకున్ని తనలోనికి లాగుకొనును.

★ మోక్షమనగా వ్యక్తిత్వము తొలిగిపోవుటకాదు. పరమాత్మను తానుగా స్వస్వరూపుముగా అనుభవించుటయే యగును.



★ నాకు సత్యమే భగవంతుడు.

★ మనచుట్టు ఉన్న ప్రతివస్తువు ప్రతిరోజు మార్పు చెందుచున్నప్పటికి అన్నిటిచాటున ఎన్నడును మార్పుచెందని ఒకానొక చైతన్య శక్తి కలదు. అదియే దేవుడు.

★ శరీరమునకు ఆహారమువలె ఆత్మకు ప్రార్థన ఆవశ్యకము.

★ సత్సంగము, సత్ప్రవర్తన దీనికి మించిన మతము లోకములో మరేదియును లేదు.

★ దేవునకు భయపడువానికి, మానవ భయముండదు.

★ దేవుడు సత్యస్వరూపి తన ప్రేమవలననే అతడు నాస్తికుని కూడా బ్రతికించుచున్నాడు.

★ ఏ ప్రభువు లక్షలకొలది శరణాగతులకు సహాయమొనరించెనో అతనినే మరిచెదవా?

★ భగవంతుని న్యాయమును అనుమానించిన, వ్యక్తి హృదయము వికసింపనేరదు.

★ సమస్త ప్రాణుల హృదయములందుగల పరమాత్మనే నేను ఎరుగుదును. ఇతర దేవతలను ఎరుగును.

★ దేవుడు ఎవరిని రక్షింపగోరునో, వారికి ఎవ్వరును హాని కలిగించలేరు.

★ దేవుడు వెలుగే కాని చీకటికాదు. సత్యమే కాని అసత్యము కాదు.

★ మీరు ఆయుధమును వదిలి ఈశ్వరుడే తోడని తలచి బయలుదేరుడు. మీకు ఎట్టి హానియుకలుగదు.

★ మనుష్యుని యందుగల ఆధ్యాత్మిక బలహీనతను భగవంతుడు నాశనము చేయును. సైతాను అధికము చేయును.

★ మనకు రాత్రి కలదుగాని భగవంతునకు రాత్రిలేదు.

★ తనను చిన్నవానినిగా తలంచువానికే దేవుడు సహాయమును చేయును.

★ దేవుడు తనకు తోడుగానున్నాడని తలంచువాడు ఎన్నటికిని అపజయమును పొందడు.

★ దేవుడు మనలను రక్షించునంతవరకు బలవంతుడైన శత్రువైనను మనలను చంపలేడు.

★ పూజించు విధానము, జపించు మంత్రమును ఈశ్వరుడు పరిశీలించడు. మన మనస్సును మాత్రమే పరిశీలించును.

★ ఎవడు సత్యము నెరిగి మనోవాక్కాయ కర్మలచే దానిని ఆచరించునో అతడే పరమేశ్వరుని గుర్తించగలడు.

★ అశుద్ధ శరీరబుద్ధులతో మనము దేవుని ఆశీర్వాదములను పొందలేము.

★ బుద్ధిమంతునకు, మూర్ఖునకు, పాపికి, పుణ్యాత్మునకు కూడ ఒక్కడే దేవుడు.

★ మనుష్యుడు ప్రయత్నము చేసి ఫలితమును దేవునిపై వదిలిపెట్టవలెను.

★ దేవుడు కాశీలో లేడు, మక్కాలోలేడు, అతడు ఇంటింటా వ్యాపించియున్నాడు ప్రతి హృదయమునందు ఉన్నాడు.



★ దేవునిచే నిర్ణయింపబడిన నియమములను పాటించుటయే జపము.

★ దేవుడు మనలను రక్షించుటకు ఇష్టపడనిచో, ధనము మనలను రక్షించదు. తల్లిదండ్రులు రక్షించరు. పెద్ద డాక్టర్లు కూడా రక్షించలేరు.

★ శరీరము అశాశ్వతము కాని ఆత్మ శాశ్వతము.

★ మతములన్నిటికి గమ్యము ఒకటే, కాని చేరు మార్గములు మాత్రము వేరువేరుగా నుండును. మనష్యులెందరు కలరో అన్ని మతములు కలవు.

★ మతమును మార్చుకొనుటకంటె మరణించటమే మేలు.

★ తెలిసికొన్న వానికి, జననము, మరణము రెండును సమానములే.

★ రేపు,మాపు అని నమ్మియుండుట మహాప్రమాదము. పావురమును డేగ పొంచియుండునట్లు ప్రాణిని మృత్యువు పొంచియున్నది. ఏ క్షణములో మీద విరుచుకుపడునో!

★ జనులారా! చాలాకాలము లోకవిషయములను చెప్పుటలో వృధా అయిపోయింది. ఇకమీదటైనా పరమాత్ముని నామమును చెప్పిండి, వినండి.

★ నాలోపల నేను భగవానునని అనుభూతిని పొందనివాడు ప్రతిరోజు దుఖమును, నైరాశ్యమును అపారముగా జూతును. అంతియే కాదు వెఱ్ఱివానిగా నగుదును.

★ మిమ్ము ద్వేషించువారికి మేలు చేయుడు, శపించువారిని దీవించుడు. నిందించువారి క్షేమము కొఱకు దేవుని ప్రార్థించుడు, శత్రువులను ప్రేమించుడు.

★ మిమ్ములను ఇతరులు ఏ ప్రకారము చూడవలెనని మీరు అభిలాషించుదురో, ఆ ప్రకారము మీరితరులను చూడుడు.

★ సముద్రమునుండి ఒక నీటిబొట్టును విడదీసినచో అది మురిగి, చెడి నశించిపోవుచున్నది. అట్లే నేను దేశకాలాదులచే పరిమితమైన దేహాది ఖండ పదార్థమును అని తలుచువాడు, అశాంతిని దుఖమును పొందును.

★ మొదట నీ కంటిలోని పొరలు తొలగించుకొనుము. తరువాత నీ సోదరుని కంటిలోని నలుసును తీసివేయుటకు ప్రయత్నించవచ్చును.

★ మొట్టమొదట భగవంతుని ఆశ్రయింపుడు. ఆ పిదప అన్నియు నీకడ వచ్చి చేరును.

★ ప్రపంచ వస్తువులన్నింటికంటెను దేవుని ఎక్కువ ప్రేమతో జూచువాడే అతనిని పొందుటకు అర్హుడు.

★ భూలోకమంతయు గెలిచి రాజ్యాభిషిక్తుడైనను తన ఆత్మ సంరక్షణ జేసికొనని మానవుని జీవితము నిష్ప్రయోజనమే అగును.

★ త్యాగము, వైరాగ్యభావము లేనిచో శాంతి ఒకింతైనను లభించనేరదని ముమ్మాటికి నమ్ముము.

★ ఎక్కడ నీ స్వస్వరూపమైన ఆత్మ తప్ప రెండవది కనబడదో, వినబడదో అదియే పరిపూర్ణస్థితి యత్నపూర్వకముగ అద్దానిని సాధింపుము.

★ లోకహితాత్మకములగు కార్యముల కొఱకై మనుజుడు తన జీవితమును వినియోగించవలెను.



★ ఇంద్రియములను జయించువారు మృత్యువును కూడా జయించుదురు. ఇంద్రియములకు లోబడువారు దేవతలైనను వినాశమునే పొందుదురు.

★ సర్వ ప్రాణికోట్ల హృదయములో వెలుగుచుండు పరమాత్మను, తన ఆత్మను ఒక్కటిగా కనుగొనటయే సనాతన ధర్మము అగును.

★ భగవంతునిమీద భక్తి గలిగినవారు చాలమంది యుండవచ్చును. గాని భగవంతుని దయను సంపాదించిన వారు అరుదుగా నుందురు.

★ బ్రేకులేని కారు, కళ్ళెములేని గుఱ్ఱము, పగ్గాలులేని ఎద్దు, సంయమములేని జీవితము కూడ నిరుపయోగమే.

★ కుంభ వర్షములో కొన్ని కుండలు బోర్లించిన కొన్ని కుండలు మూత తెరచిన, కొన్ని కుండలు మూతమూసిన అందులో మూత తీసినవి నిండును. తక్కినవి నీరు లేకుండును. అలాగే ధ్యానసమయములో అమృతముకు తెరిచిన కుండలు మాత్రమే నిండును. విషయములతో మూసిన కుండలు నిండవు.

★ సీసము కాసిన దానికి రూపము లేదు. కాని అది ఏ పాత్రలో పోసిన దాని రూపము అగును. అలాగే మనసు ఏ భావముతో నిండిన ఆ రూపముగా మారును.

★ దాన ధర్మాలొసంగక డబ్బును కూడ బెట్టుచున్నారు. వానిని చూచి డబ్బు నవ్వుచున్నది. దానికి వాడు కాపలాగా కుక్క జన్మనెత్తవలయును.

★ దృశ్య విషయములపై వ్యామోహము కలిగి మనుజుడు వాని వెంట పరుగిడుచున్నాడు. వానిని చూచి ఇంద్రియములు నవ్వుచున్నవి.

★ మరణరహితుడైన పరమాత్మని సేవించక, దేహమే తానని మానవుడు మురిసిపోతున్నాడు. వానిని చూచి మృత్యువు నవ్వుచున్నది.

★ పడవ ఎటువైపు నడిచిన, దిక్సూచి ఉత్తరమువైపునకే చూచును. అలాగే జ్ఞానులు ఏ కార్యమునందున్నను, వారి చిత్తము భగవంతునివైపే ఉండును.

★ ఈశ్వర ధ్యానము, తపస్సు, తీర్ధయాత్రములు చేసిన ఎడల ఇంకొక జన్మలో ముక్తి లభించును.

★ మహాత్ములను సేవించిన మాత్రముచే ఈ జన్మలోనే ముక్తి కరతలామలకమగును.

★ పూర్వ జన్మలో దానధర్మములు చేయనివారు ఈ జన్మలో బీదవారుగా జన్మింతురు.

★ అంతయు భగవంతుడే చేయును అనుట తామసభక్తి దానినీ సోమరితనమందురు.

★ పుణ్యకర్మ, జపధ్యానములు, ప్రార్థనలు ఇవి కేవలము పుణ్యలోకాలను మాత్రమే కలిగించును.

★ శాంతిని కోరేవారు రాగ,ద్వేష, అసూయ, క్రోదాలను అణచి వేయవలెను.

★ నిరంతరము సాధనము చేయువారు ప్రకృతి జనులతో నెక్కువ కలిసియుండరాదు. వారితో కలిసియున్నచో వారి లక్షణములు ప్రవేశించగలవు. ఏకాంతమున దైవభావములో కొంతకాలము శీలించినచో అట్టివారు దైవ స్వరూపులగుదురు.



★ నియంత్రించలేని రుచులను తృప్తిపరచడానికై మానవుడు ఒక్క జంతువును చంపినా, ప్రకృతిశాసనాలను ఉల్లంఘించినందుకు బాధ్యుడై దానికి తగిన దండన పొందుతాడు.

★ ప్రత్యేకమైన ఈ మానవరూపం లక్షలకొద్ది సంవత్సరాల తర్వాత అనేక జనన మరణాల తరువాత పొందబడిందని, బుద్ధిమంతులైన మానవుడెప్పుడూ జ్ఞాపకముంచుకోవాలి.

★ దైవ చింతనలేని మానవుల విద్యాభ్యుదయం శవాలంకరణతో పోల్చబడింది.

★ మానవ ధర్మాలను నిర్వహించక పోయినట్లైతే అసుర లోకాలకు వెళ్ళి అధమజాతి జీవితము పొంది, అజ్ఞానాంధకారములో నిమగ్నము కావలసివస్తుంది.

★ జీవుడు నరకానికి వెళ్ళదలచినట్లైతే భగవంతుడెలాంటి జోక్యం చేసుకోకుండ, అతనిని ఆ మర్గాములోనే నడిపిస్తాడు.

★ మానవుడు పరమపదానికి (భగవంతుని సన్నిదానానికి) చేరదలచుకుంటే భగవంతుడతనికి తోడ్పడుతాడు.

★ ఈ భౌతిక ప్రపంచము మృతప్రాయమైనది.

★ రజోగుణముతో నున్నవాడు భౌతిక సంబంధమునుండి విడువడలేడు.

★ అజ్ఞానాంధకారములో నున్నవాడు తానెవరో భగవంతుడెవరో తెలుసుకోలేడు.

★ ఎవరైన పరమసత్యాన్ని తెలుసుకోవాలంటే, 24 తత్త్వాలకు మిరిమిట్లు గొలిపే తేజస్సుకు అతీతంగా తన దృష్టిని ప్రసరింపచేయాలి.

★ కోరికలను జయించిన వానికే శాంతి లభిస్తుంది. శాంత మనస్కుడే ముముక్షువు కాగలడు.

★ నిష్కల్మషమైన మనోబుద్ధులు, నీతిమార్గము కలవారికి మాత్రమే నిష్ఠ కుదురుతుంది. అట్టివారే ఆత్మసాక్షాత్కారమునకు అర్హులు.

★ బ్రహ్మజ్ఞానికి ఆత్మపదార్థము తప్ప అన్యము గోచరింపదు.

★ సృష్టికర్త మొదలగు వారు పరబ్రహ్మము యొక్క అఖండ ఆనందములో ఒక్క అణువుమాత్రమే రుచి చూచి తదనుగుణంగా ఆనందము అనుభవిస్తున్నారు.

★ శిష్యుడు గురువుని చేరేది, లేనిది పొందేందుకు కాదు. ఉండి తెలియని దానిని ఉన్నట్లు తెలుసుకునేందుకు.

★ మెచ్చే భోగాలు, వచ్చే రోగాలకు రాస్తాలని తెలిసినా మనుషులు భోగాలను వదలరు.

★ భోగాలు దుఃఖాలకు కారణాలు అనే సత్యం అర్థమైతే ఏ భోగాలైనా, ఎవరి భోగాలైనా అవాంఛనీయములే.

★ ఉన్నవాటిని త్యజించడము వైరాగ్యముకాదు. అవసరము కాని వాటిని మనస్సులో ప్రవేశించకుండా జాగ్రత్తవహించడమే.



★ ఒకదాని అర్థాన్ని వేరొక దానిలో వెతకడం అర్థరహితం.

★ చీకటితో చీకటిని పోగొట్టలేము. కనుక కర్మలద్వారా మాత్రమే అజ్ఞానము తొలగదు.

★ నిలువచేసుకొని జంతువులు తాత్కాలికంగా తృప్తిపొందు తున్నాయి. ఎంత నిలువ చేసుకున్నా మనిషి తృప్తి నెరుగడు.

★ స్వర్గము భోగభూమియేకాని కర్మభూమికాదు. ఏమి చేయాలో తెలిపేదే వేదము.

★ వైరాగ్యమునే ప్రమిద, భక్తియనే తైలము, చిత్తఏకాగ్రత అనే వత్తి, తత్త్వవిచారణయను అగ్గిపెట్టె కలిగియుండు వారికి జ్ఞాన జ్యోతి చక్కగా వెలుగుచుండును.

★ కోపము, అసూయ, మున్నగు దుర్గుణములు కలవారి యొక్క అనుష్టానములు, కళాయిలేని పాత్రలో వండిన పప్పుపులుసు వలె వ్యర్థమైపోవును.

★ భగవంతుడొసగిన జీవితకాలమును క్షణమైనను వ్యర్థపరచక జాగ్రత్త కలిగి ఉపయోగపరుచుచుండిన మాత్రమే, ఈ జన్మలోనే తరించి ఆత్మశాంతిని దైవప్రాప్తిని పొందగలరు.

★ మనస్సు చేయు చేష్టలను ఏకాంతముగా కూర్చుండి జాగ్రత్తతో నిరీక్షించు చుండిన, మనోజయము త్వరలో సిద్ధించును.

★ దుర్గుణములు మనస్సునందు వచ్చిరాక మునుపే, జాగ్రత్తగా కనిపెట్టి వాటిని తరిమివేయవలెను.

★ ఓ మానవుడా ! ఎల్లప్పుడు ఊర్ధ్వదృష్టి ఉన్నత లక్ష్యము కలిగియుండుము.

★ విశ్వమంతయు పరిణామశీలమైయున్నది. కాని ఎన్నడు ఏ మాత్రము పరిణామమునొందని వాడొకడు కలడు అతడే దేవుడు.

★ అన్నిటకంటే బరువు, నీ మనస్సులోని దుర్గుణాలే సుమా!

★ అన్నిటికంటే తేలిక, నిస్సంకల్ప మనస్సే.

★ దైవము కొరకు పరితపించకుండా ఎవరును దైవమును పొందలేరు.

★ రామనామము సంసారదుఃఖము యొక్క బీజమును దహింపజేయును.

★ ఆత్మకు మోక్షమును కలుగచేయుట మనపనికాదు, బంధమును తొలగించుటయే మనపని.

★ ప్రతి మానవుడు ఇనుప సంకెళ్ళలాంటి బంధమును కలిగియున్నాడు. గురువు సహాయము ద్వారా వాటిని తెంచుకోవడమే మోక్షము.

★ అమృతాత్మ స్వరూపులారా! ఈ అంధకారము నుండి బయట పడుటకు ఆవలనున్న పరమాత్మను సందర్శించుటయే తప్ప వేరొక మార్గము లేదు సుమా!

★ హృదయము నుండియే దేవుడు పలుకును. శిరస్సు నుండి నీవు పలుకుదువు, కావున ఎల్లప్పుడు హృదయమును విశాలపరచుకొనుము.



★ ప్రపంచమను క్షీరమును బహుకాలము మదించుటచే దేవుడనే వెన్న బయటకు వచ్చుచున్నది. హృదయ పవిత్రత గలవారు, ఆ వెన్నను స్వీకరించుచున్నారు. భౌతిక పరిజ్ఞానము కలవారు, మిగిలిన మజ్జిగను త్రాగుచున్నారు.

★ అసత్యమగు అహంభావము తొలగింపబడినపుడు, సత్యమును దైవభావము శేషించును.

★ తనయందున్న పశుసంస్కారములు కడిగివేయబడినచో తక్షణమే దైవ సంస్కారములు పొంగిపొర్లును.

★ ఏ మాత్రము కంగారు పడకుండా శాంతముగా నిర్మలముగా ఆలోచించుము.

★ సర్వప్రాణులను హృదయ పూర్వకముగా ప్రేమించుట నేర్చుకొనుము.

★ పవిత్రమగు ఉద్దేశములు కలిగి, ఆ ప్రకారమే నడుచుకొనుము. నీవు పవిత్రమగుదువు.

★ దైవము యందు, గురువాక్యమునందు శాస్త్రమునందు నీ యందు పరిపూర్ణ విశ్వాసముంచుకొనుము.

★ రక్తమాంసములతోను, ఎముకలతోను గూడిన ఈ దేహముపై అభిమానము ఎప్పుడైతే తొలుగునో, అప్పుడే శాంతి లభించును.

★ భార్యపుత్రాదులపై మమత్వము వదిలిన తోడనే, జీవుడికి దైవమార్గము చక్కగా తోద్పడును.

★ ఈ జగత్తంతయు క్షణ భంగురమనియు, ఈ బోగాదు లన్నియు మూణ్ణాళ్ళ ముచ్చటనియు చక్కగా తెలుసుకొనుము.

★ ఓ మానవుడా! నీవు శాంతముగా ఉండవలెనన్న వైరాగ్యము, భగవద్భక్తి మిక్కుటముగా కల్గియుండుము.

★ ఓ జీవా! దుర్జన సాంగత్యమును వెనువెంటనే విడనాడుము.

★ ఎంత కష్టమైనా సరే సజ్జనసాంగత్యము విడనాడకుండ కలిగియుండుము. సత్పురుషుల సాంగత్యమే మోక్షానికి మార్గము.

★ ఓ మానవుడా! అహోరాత్రులు కష్టించి పుణ్య సంపాదనము గావింపుము.

★ ఓ జీవా! శరీరాది దృశ్యపదార్థముల యొక్క అనిత్యత్వమును గూర్చి బాగుగా స్మరించుచుండుము.

★ ఓ మానవుడా! నీవు మొదట సేవకుడవై ఉండుటకు నేర్చుకొనుము. తర్వాత అధికారపదవికి అర్హత చేకూరగలదు.

★ గుడ్లగూబ పగలు చూడలేదు, కాకి రాత్రి చూడలేదు, అట్లే కామాంధుడు పగలురాత్రి చూడలేదు సుమా!

★ బయట కనిపించుచుదంతయు లోపలదే. తనలోపలే ఈ ప్రపంచమున్నది. కావున లోనికి తొంగిచూడుము.

★ ఆనందము కొరకు బయటకు పరుగెత్తడమేల, తానే ఆనందమని సత్పురుషులద్వారా సాధన ద్వారా తెలుసుకొనవలెను.



★ ఓ జీవా ! ఇంద్రియములు ప్రబల శత్రువులు కావున నిరంతర జాగరూకత అవసరము సుమా!

★ తాను కాని దేహాదులు తానని తలుచుటయే పాపము అదే బంధము తెలుసుకో.

★ అందరిది పరబ్రహ్మగోత్రము, అందరిపేరు స్వయంప్రకాశము, అందరి స్వరూపము చిదాకాశమని తెలుసుకొని సేవింపుము.

★ నీవే సాక్షాత్ విశ్వనాధుడవు. ఈ విశ్వము నీ యొక్క శరీరము అని అనుభవము ద్వారా తెలుసుకో, చూడు.

★ సమస్త ప్రాణికోట్లకై ఉపకారమొనర్చుటయే పుణ్యము అపకారమొనర్చుటయే మహాపాపము.

★ దేహము బుడగవంటిది కాబట్టి సమయమును వ్యర్థముగ గడుపక ఆధ్యాత్మిక సాధన చేయుము.

★ స్వభావ విహితమైన ధర్మం తనకొరకేకాక, పరోపశాంతికి కూడ పనికి వచ్చును.

★ గంగానది పాపమును, చంద్రుడు వేడిమిని, కల్పతరువు దరిద్రమును పోగొట్టును. కాని సత్పురుషుల సాంగత్యముపై మూడింటిని దూరము చేయును సుమా!

★ ఎవరికి స్వయంప్రతిభలేదో అట్టివారికి శాస్త్రము ఎందుకు? గ్రుడ్డివానికి అద్దమెందుకు?

★ ప్రతిరోజు భయపడే మనిషి ఎక్కడా సురక్షితంగా మనలేదు.

★ సద్వచనాలు విని ప్రయోజనములేదు. వాటిని ఆచరణలో పెట్టడమే కర్తవ్యము.

★ నిన్ను ప్రేమించే వారిని ప్రేమిస్తే గొప్పతనం ఏముంది, నిన్ను ద్వేషించేవారిని ప్రేమించు.

★ మంచితనము మల్లెపూల పరిమళంగా ఎన్నటికీ వెదజల్లుతూనే ఉంటుంది.

★ నాలుకను అదుపులో ఉంచుకొన్నవారు ఈ ప్రపంచాన్నే జయిస్తారు.

★ చదివిన చదువుకాదు, సంపాదించుకొన్న సద్భావాలే వ్యక్తికి పెట్టనికోట.

★ ఎంత ఉన్నతంగా ఎదిగితే అంత వినయంగా ఉండటము నేర్చుకొనవలెను. నిండా పండిన మామిడిచెట్టు చందమున.

★ పూర్తిగావినకుండా ఖండించడము చెడ్డపని, ఆ మాత్రము సహనములేని వానితో చర్చించడము సరైనదికాదు.

★ మనిషి విజయానికైన, అపజయానికైన వారి ఆలోచనలే వారికార్యాలకు కారణమౌతాయి.

★ క్షమాగుణం బలహీనతకాదు. క్షమించడానికి శిఖరమంత మనోబలం కావాలి.

★ భోగాలపై వ్యసనరూపమైన ఆసక్తిలేకుండా ఉండుటయే శాంతికి మార్గము.

★ శాంతికి నిలయము నీ హృదయము,
నీ హృదయములో ఆ హృషీకేశున్ని సదా, చింతించు.



★ నమ్మినవారికి, భయపడువారికి, దీర్ఘవ్యాధులు గలవారికిని, మహానుభావులకు, మహర్షులకు చేసిన ఉపకారము అప్పటికప్పుడు పరిపక్వమై ఫలములొసంగును.

★ ఓయి! ఎందుకు ఎగిసెగిసి పడుతావు? ఏనాటికైన ఒకనాడు ఆత్మలో లీనమవ్వవలసినవాడవే సముద్రముపై అలలు ఎంతఎగిరినా చివరికి సముద్రములో అంతమవ్వవలసిందేగా!

★ ఎదురుగాలులైనా, అవి సుడుగాలులైన వాటిని ఎదుర్కొని నిలబడు వాటికి భయబడి నీకున్న సుగుణాలను వదలకు, మామిడిచెట్టు గాలికి దాని ఫలాలను కోల్పోయినప్పుడు ఇతరులకు తృప్తినివ్వదుగా!

★ గురువు, దేవుడు ఒక్కటే. మరి గురువు ఎదురుగా, శ్రద్ధగా ప్రవర్తించు చేతకానివేళ తనకు మాటనివ్వకు ఒకవేళ ఇచ్చినా, దానిని బలవంతముగా తీసుకొనినవేళ నీకు బాధగా ఉండొచ్చు!

★ మతము అనునది మానవత్వమే!
మానవత్వమే నీలో లేనప్పుడు
నీవు మతాన్ని నాశనము చేసినవాడవౌతావు.

★ ఎన్నిరోజులు ఈ ప్రకృతిలో సంచరించినా తిరిగి తన స్వగృహానికి చేరుకోవాలన్న సంగతి గుర్తుంచుకో, పశువులు దినమంతా అడవిలో సంచరించినా, సంధ్యావేళ ఇంటికి చేరునుకదా!

★ చింతలలో కాలాన్ని గడిపి జీవితాన్ని చితాబస్మానికి గురిచేయకు. చిదానందుని చింతించి సదా ఆనంద స్వరూపుడిగా మిగిలిపో!

★ ఓయీ ఇకనైనా మేలుకో, నిన్ను నీవు జాగృతం చేసుకో! జన్మ తరిస్తుంది.

★ గతించిన విషయాలను నెమరువేసుకుంటూకాలాన్ని గడపకు, ఆ గజేంద్ర రక్షకుడగు నారాయణ నామస్మరణముతో కాలాన్ని గడుపు, నీకు గతిగా ఆ ప్రభువే నిల్చును.

★ ఓ జీవా! ఈ ధరణిలో దంబహంకారములతో కాలాన్ని వృధాచేయకు. ధర్మమార్గమును తెలుసుకొని గడుపు, ఆ ధర్మమే కదా పరమాత్మునికి ప్రాణము.

★ మహాత్ముల మాటలను మఱుగునపెట్టకు. ఒక్క వాక్యాన్ని తీసుకొని ఆచరించి చూడు. ఈ చరణాలతో నడిచిన, ప్రభు చరణాలు తప్పక లభించును సుమా!

★ ఓ మానవుడా మానకు నీ ప్రయత్నము మఱుజన్మ మేమౌనో, మరి ఈ క్షణమే మహాత్ముల కడకేగి మలినాన్ని కడుగుకునే ప్రయత్నము సలుపుము, మహేశ్వరుడు తప్పక అనుగ్రహించును.

★ ఓ జీవా! దేహభావముతో బ్రతుకకు! దహించబడేది దేహమని తెలుసుకో, దైవాన్ని చేరుకోవడానికి దైవముచే ప్రసాదింపబడిన సాధనమని తెలుసుకో.



★ ఒక చెట్టుని, ఆకుని, పువ్వుని, పక్షిని, చూసి స్పందించలేనివాడు, తోటి మనిషిని కూడ చూచి ఏ మాత్రము స్పందించలేడు. అలాంటివాడు దేశానికి కూడ ఏమి చేయలేడు.

★ దైవాన్ని నమ్ము దారి దొరుకును. దైవమును నమ్మనివాడు దఠికి చేరలేడు సుమా!

★ అజ్ఞానమనే చీకటిలో జ్ఞాననిధులు నింపేవాడు గురువు. అటువంటి గురుదేవుని మనసారా సేవించి పాపప్రక్షాళన చేసుకో!

★ చీకటి బ్రతుకు ఎన్నాళ్ళు బ్రతుకుతావు. ఒకసారి ఆ అమృతరాముని చెంతకు చేరు. నీ సంసారాన్ని పటాపంచలు చేయును.

★ భక్తితో ఆ హరినామ స్మరణచేయుము. నీ భయాలన్ని దూరమౌను మరియు నిన్ను భవసాగరము నుండి ఆ నామము దాటవేయును.

★ దేనికి భయపడకుము. కాని నీవు చేసే పాప కర్మలే నిన్ను వెంటాడును. కావున, పాప కర్మలను చేయకుము.

★ మాయా మోహములో ఎన్నాళ్ళు ఈదుతావు, ఒక్కసారి మా రామున్ని సేవించి చూడు మఱ్మము తెలుస్తుంది.

★ ఎన్ని జన్మల ఫలమో ఎత్తావు మానవజన్మను, ఏ ఒక్క క్షణము వృధాచేయకు. యముడున్నాడని గుర్తుంచుకో.

★ ఆలుబిడ్డలు అని అహర్నిశలు శ్రమిస్తావు అంతా మాయ అని తెలుసుకో. మఱ్ఱమెరిగి నడుచుకో మాధవుడు దొరుకును.

★ జ్ఞాన సంపదను ఆర్జించు, నిన్ను మోక్షమునకు చేర్చును. వృధాగా శ్రమించి ప్రకృతిసంపద ఎంత సంపాదించినా నీకేమి కొరగాదు సుమా!

★ ముల్లోకములో గురుమూర్తిని మించిన దైవములేదు. అటువంటి గురుమూర్తిని సేవించి గుణములనుండి దాటు.

★ ఎల్లప్పుడు రామ అనో, కృష్ణ అనో, నారాయణ అనో ఏదో నీకు తోచిన భగవన్నామము స్మరిస్తూ బ్రతకడము నేర్చుకో.

★ అంతటా నిండి ఉన్న ఆ ఆత్మరాముణ్ణి చూడాలన్నా ఈ నేత్రములు సరిపోవు సుమా! జ్ఞాన నేత్రము సంపాదించు, జ్ఞానుల చెంతకేగి.

★ మనసారా పిలువు పలుకుతాడు. తలుపుతట్టు నీ కొరకై ద్వారములు తెరువబడును. కాని నీ ప్రేమ అతనికే చెందాలి చూడు.

★ ఎక్కడెక్కడో ఎందుకెతువుతావు. నీ ఎదలోనే అలరారుచున్నాడు. నీ ఏలికై వున్నాడు. ఒక్కసారి లోనికి తొంగిచూడు.

★ మరా మరా యని తలచి మరణమును జయించాడు, ఆనాడు వాల్మీకి. మరి భగవన్నామము యుక్తమార్గమున స్మరించు, ముక్తి మార్గము దొరుకును.



★ జన్మమఱ్ఱమేమి తెలుసుకో ! దానికి కర్మనే కారణమని తెలుసుకో. ఆ కర్మను మహాత్ములకడకేగి జ్ఞానము ద్వారా కడుగుకొని మసులుకో.

★ అన్నిటికన్నా సత్సంగమే మిన్న అని తెలుసుకొని సత్పురుషుల సాంగత్యములో కాలాన్ని గడుపు, నీ పాపాలన్ని వాటంతటవే శమించును.

★ తనువు నీవని భ్రమపడ్డావు, తారకరామునిదని తెలుసుకొని అప్పగించు, తప్పక తరియించుదువు సుమా!

★ పంచభూతములతో ఏర్పడినది దేహము కేవలము పరమాత్మను పొందడానికే దొరికినదని తెలుసుకో!

★ మరుజన్మకు మూలము మదిలోని శబ్దాదివిషయాలని ఎఱుగు, అవి తొలగించుకో మళ్ళీరాదు జన్మము.

★ నీ జన్మము ఎప్పుడు రాలునో తెలియదు, ఆకు చివర నీటిబొట్టులాంటిది, మరి తెలుసుకొని రాలకమునుపే రాముణ్ణి చేరుకో.

★ నిత్యము ఆ పరమాత్ముని చరణాలను స్మరించు, నీ జన్మ తరించును.

★ మనసులో చింతలు మలినములని తెలుసుకో చింతించి చితికేగకు, చిత్తాన్ని చిదానందునిపై పెట్టు చిన్మయానందుడవవుతావు.

★ నాలుకతో నామస్మరణం, కరములతో రామసేవ, కన్నులతో రామలీలలు, చెవులతో రామకథలు చేసిన, ఆ రాముని ప్రేమనిండిపోవు నీ హృదయమంతా.

★ ఈలోకములో దాసుడవై సేవచేయి, ఆ దామములో నీకు దక్కును ఉత్తమస్థానము.

★ నీ మనసును మాధవుని మందిరముగా చేయి, మలినములైనటువంటి విషయాలకు కాదు, అప్పుడు మధుసూధనుడు నీ యందే వసించును.

★ ఎన్నో జన్మలెత్తితివి, ఆ ఆత్మారాముని భావములు ఎరుగక ఎందెందో తిరిగితివి, ఏమి సాధించలేక వేసారితివి తెలుసుకో!

★ వీడకు వాడవు, మరువకు వెరవవు, మరణమురాదు, మనసు మాధవునిదైతే.

★ రాగద్వేషాలను వదులు, రోగమురాదని తెలుసుకో భక్తిని పెంచు, ముక్తిని చేరుకో.

★ కలియుగమున ప్రతిజీవుడు తరియించుటకు ఆ భగవన్నామ మొకటే శరణమని తెలుసుకొని, ఆ భగవన్నామాన్ని స్మరించి తరించు.

★ ఓ జీవా! ఈ లోకము ఏనాటికైన వదిలేదేనని గుర్తించి ఆశాపాశాలను వదిలి, నీలోనే ఆ ఆనందపు దివ్వెలను వెలిగించి చూడు.

★ మహాత్ముల మాటలను నమ్ము, మాయను జయించే మార్గము దొరుకును.

★ ఈ లోకములో ఒక్క నిమిషమైనను వ్యర్థముగా గడుపకు. ఆ పరమాత్ముని దివ్యలీలలో గడుపు దివ్యత్వము దొరుకును.



★ సద్గురువు మాటను జవదాటకుము. సేవించి భక్తితో మెలుగు. ముక్తి నీచెంతనే చేరును.

★ ఆ రాముని చరణాలను సేవించు నీ తనువుతో సేవచేయి, తరించెదవుగాక.

★ జన్మనెత్తిన ప్రతిమానవుడు ద్విజుడుగా కావలెను. గుర్తుంచుకొని మసులుకొని మానవజన్మను సార్థకముచేసుకో.

★ ఈజగమంతా ఆ రాముని లీలలే కనపడును. ఒక్కసారి నీ దృష్టికి ఆవరించబడిన తెరను తొలగించి చూడు.

★ ఓ మానవుడా ! నీలోనున్న దుర్గుణాలకు తిలోదకాలిచ్చి, సద్గుణపూలమాలనలంకరించు అదియే ఆ పరమాత్ముని కిష్టము.

★ ప్రతి ప్రాణిలో పరమాత్ముడున్నాడని తెలుసుకొని సేవించు. నీవు పరమాత్మను సేవించినవాడవే అవుతావు.

★ భగవన్నామమనే నావ నాశ్రయించు, నిన్ను సంసార సముద్రమునుండి దాటి వేయించును.

★ ఓ జీవా! ఈ చరణాలతో భగవంతుని శాసనాలను ఆచరించు. ఆ స్వామి చరణాలు తప్పక లభ్యమౌను.

★ అహంకారమే అన్నిటికి మూలము దానిని తొలగించి చూడు, అంతా ఆ రాముడే దర్శనమిచ్చును.

★ ఓ జీవా! సమస్యలను సృష్టించుకొని సాలీడులాగా ఎందుకు బాధపడతావు.

★ విషయాలలో ఆనందంగా గడుపకు, అందులో విషమున్నదని గుర్తించుకో.

★ చింతన చేయి పరమాత్మను, చెంతనే నున్నాడు చూడు ఎందుకు వెతలు పడతావు.

★ శరణను ఆ దేవునికి, దేహాలనుండి విడువడుదువు. శవముగా మారక, శివత్వము చేరుదువు.

★ రామనామ రసాన్ని ఆస్వాదించు. రాగాలు, రోగాలన్ని దూరమౌను.

★ గుడిలోన రాళ్ళలోన, వెతికినా దొరకదు ఆ దేవుడు. నీగుండెల్లో నిష్కామంగా వెతుకు నిముషములో దొరుకును.

★ ఓ జీవా! సమస్త జీవకోటి ఆ పరమాత్ముని స్వరూపులని గుర్తుంచుకో, అది తెలియకుండా జీవించడమే మహాపాపమని తెలుసుకో.

★ ప్రకృతిలో జీవించిన ప్రతిజీవి తననుతాను ఉద్ధరించుకోవడానికి మాత్రమే అరుదెంచెను. కాని ఆ విషయము మరిచి బ్రతుకుతున్నాడు అంధకారములో.

★ పాహి పాహి అని వేడుకో. ఆ పరమాత్ముడు తప్పక పాపకూపమునుండి తరించును.

★ ఓ జీవా! ఎన్నో జన్మలెత్తితివి, విషయాలయందు తిరిగి తిరిగి వేసారితివి. ఈజన్మయందైన సాహసించి సత్పురుషుల సాంగత్యబలమున సాయుజ్యమును చేరుకో.

★ ఓ నరుడా ఇకనైనా మేలుకో, జన్మ రహస్యంబు తెలుసుకొని వైరాగ్యముద్వారా వాసనలను వదిలి వైకుంఠపదమును చేరుకో.

★ ఓ మనసా పరుగెత్తి పరుగెత్తి వేసారలేదా! ఒక్కసారి పరుగెత్తడమాపి చూడు ప్రశాంతత దొరుకును. పరమానందము లభ్యమౌను.



★ ఓ జీవా! మానవజన్మ మహోన్నతమైనది. ఒక్కసారి చేజారితే మళ్ళీ దొరకడము కష్టము. తెలుసుకొని ఆ రామున్ని తలుచుకొని తనువంతా సేవచేసుకో, తనవాడవౌతావు.

★ మమతాభిరాగాలు మరణమునకు దారితీయును, మహేశ్వరుని చింతించు మహాత్ముడవవుతావు.

★ ఎన్నిజన్మలెత్తితివో ఎందెందు తిరిగితివో కాని, ఈ జన్మయందైన తెలుసుకొని నీయందున్న ఆత్మారాముణ్ణి అందుకో.

★ ఓ మానవా నమ్ము వమ్ము చేయడు. విశ్వసించు విశ్వాసముతో విశ్వేశ్వరునితో కలిసిపోదువు.

★ ఓయీ సహనముతో మెలుగు, సర్వేశ్వరుని అనుగ్రహమెప్పుడు నీవెంటే ఉండును.

★ ధర్మమార్గాన్నాశ్రయించు ధరణియందెలాంటి బాధలుండవు. ధర్మాత్ముడవుగా దయజూపును రాముడు.

★ ఓ మనసా పామురునోలె ప్రవర్తించకు పతనమవుతావు. పండితునిగా మారు పండును నీ జీవితము.

★ దేహాన్ని చూసుకొని మురవకు. కొన్నాళ్ళకు నీ దేహము దేనికి కొరగాదని తెలుసుకొని, దేహములో నున్న ఆ దేవుని చూసుకొని ఆనందించు.

★ దేనికి వెఱువకు. జరిగేదంత నీ వనుకున్నదే జరుగును, అది మంచిదైన చెడైనా ఆనందంగా స్వీకరించు, ఆత్మలో నిలువు.

- ★ ఇంద్రియాలను వశమందుంచుకో, ఇల్లును జాగ్రత్తగా నుంచుకో, దీపమున్నప్పుడే నీ ఇంటిని సర్దుకో.
- ★ పాపపుణ్యములు రెండు నిన్ను పరమాత్మను చేరనియ్యవు, జ్ఞానము సంపాదించు. అజ్ఞానాన్ని తరిమెయ్యి.
- ★ జన్మమెత్తినది జ్ఞానము పొందడానికని తెలుసుకో, జ్ఞాన నౌకనాశ్రయించి సంసారమనే సముద్రాన్ని దాటు సుమా!
- ★ పరదుఃఖమును తనదుఃఖముగా ఎవరు తలుస్తారో పరమాత్మయొక్క సాన్నిధ్యమునకు అర్హులౌతారు.
- ★ ఈ ప్రపంచమంతా పరమాత్ముని కుటుంబము అని ఎవరైతే తెలుసుకుంటారో వానికి రాగద్వేషాలుండవు.
- ★ ధనమంటే జ్ఞాన ధనమని తెలుసుకో, ప్రపం చ ధనమునకై పరుగెత్తకు, పనికిరాదని గుర్తించు.
- ★ ఈ జగమంతా పరమాత్ముని యొక్క అంగములని తెలుసుకో, నీవు కూడ అందులో ఒక భాగమే సుమా!
- ★ త్యాగ బుద్ధి కలిగి వుండుము. నీవేదైతే వదులుతావో అంతా నీదౌతుంది. నీవేదైతే దాచుకుంటావో అదెన్నిటికి నీది కాదు.
- ★ ప్రతిఫలాన్ని ఆశించక పరమాత్ముని సేవించు, ప్రతిప్రాణిలో పరమాత్ముడున్నాడని గుర్తించు. నీవు పరమేశ్వరుని చేరుతావు.
- ★ నీవు దాచినదంతా నీకు దరిద్రానిస్తుంది. దానము చేసినదంతా నిన్ను ధనవంతున్ని చేస్తుందని గుర్తించుకో.
- ★ ఓ జీవా! బండి చక్రాలవలె నీ శరీరమును సరిచేయించు, ఇరుసులాగ నీవు స్థిరంగా ఉండడము తెలుసుకో.



# శ్రీ గీతాజ్ఞాన గురుభక్త మండలి

(శాస్త్ర విధానోక్త ముక్తి మార్గము)

వ్యవస్థాపకులు : **శ్రీశ్రీశ్రీ సద్గురు రామబ్రహ్మానందస్వామి గారు**
ఇంటి నెం. 17-1-382/కె/యస్.బి./48,
బాలాజీ నగర్, చంపాపేట్, సైదాబాద్ దగ్గర,
హైదరాబాద్ - 500 059.

**"శ్రీ గీతాజ్ఞాన గురుభక్తమండలి"** సేవా సంస్థవారి ఆధ్వర్యములో ప్రతి శనివారము సాయంకాలం-6-00 గంటల నుండి 8-00 గంటల వరకు **"సత్సంగ కార్యక్రమము"** **"శ్రీ గీతాజ్ఞాన యజ్ఞము"** నిర్వహించబడును.

ప్రవక్త : **శ్రీ సద్గురు రామబ్రహ్మానందస్వామి గారు**

భవిష్యత్తులో ఆధ్యాత్మిక విద్యను అభివృద్ధి పరుస్తూ భగవదనుభూతిని తాము పొందుటయేగాక సామాన్య ప్రజలకును "భగవదనుభూతి" కలిగించు నిమిత్తమై శాస్త్ర విధానోక్త జీవ బ్రహ్మైక్య రాజయోగము సత్యమార్గములోను జ్ఞాన ప్రకాశాన్ని వెలిగించాలన్న అవగాహనతో ఈ సత్సంగము ప్రారంభించబడినది. కావున ఈ కార్యక్రమమును మన మందరము కలిసి (గురుభక్తులు) జయప్రదముచేసి శ్రీకృష్ణపరమాత్మ యొక్క అనుగ్రహమునకు పాత్రులుకాగలరని మనవి.

**బ్రహ్మోపదేశము :**

అభీష్టమున్నవారు కమిటీని సంప్రదించి తమపేరును నమోదు చేసుకొని కృతార్థులు కాగలరని మనవి.



## ఓం శ్రీరామచంద్రాయ నమః

ఓం శాంతిః శ్శాంతిః శ్శాంతిః



ఓం శ్రీ గురవే నమః

## శ్రీ గురుచరణం భవహరణం

**శ్రీ జగద్గురు రాములు గారి**

**దివ్యాశీస్సులతో ప్రారంభించబడి దినదినాభివృద్ధి గావించుచున్న శ్రీ గీతాజ్ఞాన గురభక్తమండలి వారి సత్సంగములు**

శాఖలు :

కిష్టాపూర్, రేగడిమైలారం, కొడంగల్, అమీర్‌పేట్, మహబూబ్‌నగర్ మొదలగునవి.

**మా ప్రచురణలు :**

1. ఉత్తర గీత
2. సద్గురు చాలీసా
3. భగవంతుడు - భగవంతుని దశావస్థలు
   (భగవంతుని దశావస్థలు - పటము)
4. శ్రీరామ గురుహితోపదేశములు
5. అమృత రాముని అమృత సూక్తులు
6. తత్త్వజ్ఞాన గానమంజరి (భజనమాల)
7. అమృతరాముని ఆదర్శసూత్రాలు (సూక్తులు)

**మా రాబోవు గ్రాంథాలు :**

1. శ్రీరామ బోధామృతము
2. విజ్ఞాన దీపిక (సాంఖ్య శాస్త్రము)
3. మానస బోధ
4. తత్త్వసారము
5. ఉత్తమ ప్రశ్నలు - ఉత్తమ సమాధానములు
6. ఆధ్యాత్మిక కథలు


## శ్రీ గీతా జ్ఞాన గురుభక్తమండలి

(శాస్త్రవిధానోక్తముక్తిమార్గము)

బాలాజీ నగర్, సైదాబాద్, హైదరాబాద్-500 059.